# భావస్పందన

## (గేయ సంపుటి)

రచన:

**శ్రీమతి ఎన్. ఉమాదేవి**

ప్రచురణ:



నవ్య సాహితీ సమితి
(రిజిష్టర్డు—1952)
హైదరాబాదు - విజయవాడ

# అక్షర చిత్రాలు

భావం చిత్రం అవుతుంది. చిత్రం నైరూప్య దశ నుంచి రూప దశకు పరిణామం చెందే క్రమంలో పంచవర్ణాత్మకతను సంతరించుకొని కుంచె కొనలమీద నుంచి అందమైన బొమ్మగా అవతరించవచ్చు. అది చిత్రకారుడి రచన. కాగా యీ పరిణామ క్రమంలోనే భావచిత్రం అక్షరాకృతి ధరిస్తే, కలం నుంచి కవితగా ఆవిష్కృతం అవుతుంది. అది కవి వ్రాసే చిత్రం. అందుకే కవిత్వం లేదా రచన అనేది 'అక్షర చిత్రం' అని పేరొందింది. దేనికైనా భావం ముఖ్యం కదా !!

* * *

శ్రీమతి ఎన్. ఉమాదేవి భావలోకంలోంచి వచ్చిన గేయాల మాలిక ఈ "భావ స్పందన" కృతి. పేరే 'భావ స్పందన'. ఇక భావాలకు కొదవేమిటి ? స్పందనకు హద్దులేమిటి ? ఎందుకుంటాయి ? !

నన్నయ్యగారి గోదావరి హృదయంగా, త్యాగయ్యగారి కావేరి ఊపిరిగా ఉమాదేవి యీ కృతిని కూర్చారు. అందమైన ఊహాచిత్రాలకు ఒక మచ్చుతునక 'ఆకాశం' కవిత (30–31 పేజీలు). అలాగే మౌనం (11 పేజీ) కవిత. అక్షరాలు (20 పేజీ) క్రౌర్యం (38 పేజీ) కవిత. ఇల్లా చెప్పుకొంటూపోతే మొత్తం పుస్తకాన్ని యిక్కడ ఆవిష్కరింప చేయాలి. అది నా పరిధిని అతిక్రమించడం కనుక ఆపేస్తున్నాను.

* * *

ఈ సంపుటిలోని మొత్తం కవితలన్నీ వ్యూహప్రధానాలు, భావ (Idealism) ప్రధానాలు, సందర్భ ప్రధానాలు, సందేశ ప్రధానాలు - ఇలా వర్గీకరించుకోవచ్చు. ఏ వర్గంలోకి ఏ కవిత చేరినా, ప్రతి కవితలోనూ అనుభూతి గాఢతను ఉమాదేవి ప్రదర్శించారు. స్వేచ్ఛా తిరస్కృతి (20-21 పేజీలు) భగవాన్ (22 పేజీ) కవితలు యీ గాఢానుభూతి నుంచి జాలువారిన ఆర్ద్రపదాలు.

*　　　*　　　*

శబ్దాలు, రంగులు, నినాదాల పొగలు, ఆర్భాటాల సెగలు అంటని, అంటనివ్వని అచ్చుతెలుగు అనుభూతి కవితల సమాహారా యీ భావస్పందన. ఉమాదేవి మరింత అనుభవ పారీణతతో, వైశ్చిక చింతనతో యింకా, యింకా మంచి మంచి కవితలు వ్రాయాలని, ఆశిస్తూ వ్రాయగలరని ధీమాగా చెప్తూ....

మీ

పురాణపండ రంగనాథ్

(రచయిత జర్నలిస్టు)

విజయవాడ - 26-7-1994.

# అంకితం

తను చదువుకున్నది మూడవ తరగతయినా సాహిత్యంతో మంచి అనుబంధాన్నేర్పరచుకొన్న మా అమ్మ, నేను అల్లి బిల్లి వ్రాతలు వ్రాసే నాటినుంచీ నా మొదటి శ్రోత. తానిక భూమిమీద వుండనని తెలిసాక కూడా కేవలం నా (అనువాద) నవల చదవడం కోసం కొంచెం శక్తిని దాచుకుని, అంచెలంచెలుగా నవల చదివి పూర్తిచేసి బాగుందమ్మా అని నన్ను మెచ్చుకుని పైలోకాలకేగినా నా హృదయంలో ఎప్పుడూ జీవించి వుండే మా అమ్మ శ్రీమతి గంగాభవానికి.

నా ఏ చిన్న కవిత, ఏ కథ, ఏ నవల అచ్చయినా తనే ముందు చదవాలని చిన్నపిల్లవాడిలా పుస్తకం దాచేసుకుని, అందరికంటే ముందు చదివి నన్ను దగ్గరకి పిలిచి, చాలా బాగుందమ్మా, స్వంత రచనలు ఎక్కువగా చెయ్యి అంటూ ఆప్యాయంగా ప్రోత్సహిస్తూ వుండిన మా మామగారు కీ॥ శే॥ శ్రీ రామయ్యగారికి,

నేనెప్పుడూ వ్రాస్తూనే వుండాలనీ, నా వ్రాతలన్నీ అచ్చులో చూసుకోవాలనీ నా కంటే ఎక్కువగా ఆరాటపడే నా భర్తకన్నమిన్న నా స్నేహితుడు రవికి,

నాలో కవితా స్పందన వెలగడానికి ఎన్నో దీపికలు—స్వర్ణ, రంగనాథ్, సన్నిధానం, ప్రసాద్, లత...

"అందరూ కావాలంటుంది నా హృదయం
అందించాను ఒక్కొక్క హృదయ శకలం"

—ఉమాదేవి

# చిన్నమాట–ఉన్నమాట

అద్భుతంగా వ్రాసేవాళ్ళని అందరూ మెచ్చుకుంటారు.
కీర్తి సంపాదించిన వారికి అందరూ జేజేలు పలుకుతారు.
కాని అజ్ఞాతంగా వుంటున్న వారికి ప్రోత్సాహాన్నిచ్చి
వెలుగులోకి తెచ్చే సహృదయం, సౌజన్యం
చాలా తక్కువ మందికి వుంటుంది.

అలాంటి కొద్దిమందిలో ఒకరైన మాన్యులు శ్రీ వీరభద్రశాస్త్రిగారు.
ఎన్నో ఏళ్ళనుంచి నా చిన్ని చిన్ని కవితల్ని చిన్నగా మెచ్చుకుంటూ
తెరవెనుక వుండి ప్రోత్సహించారు.
నా కవితల కొంక పట్టం కట్టిన శ్రీ శాస్త్రిగారికి
ఎప్పుడూ హృదయపూర్వకంగా కృతజ్ఞురాలిని.

ఈ గేయ సంపుటిపై
తమ అమూల్య అభిప్రాయాలని అక్షర చిత్రాలుగా మలచిన
శ్రీ పురాణపండ రంగనాథ్ గారికి,
చక్కగా ముద్రించిన శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్ వారికి
కృ త జ్ఞు రా లి ని.

—ఉ మా దే వి

# గేయ మాలికా కుసుమాలు

# నీ పేరు....

తొలిసంజె కిరణాన
పులకించు పువ్వుకొన
తొణికేటి ముత్యాన
మెరిసింది నీ పేరు

తల్లి ఎద గుడిలోన
దోబూచులాడేటి
పసిపాప నవ్వులో
తడిసింది నీ పేరు

కన్నె కన్నుల కొసల
కరగేటి కలలలో
కళకళల తళతళల
కదలింది నీ పేరు

మల్లె పూదోటలో
మెల్లగా వీచేటి
పరిమళపు ఉయ్యాల
లూగింది నీ పేరు

గొంతులో కదలాడి
పెదవి బయటికి రాని
రసరమ్య భావనల
కావ్యమే నీ పేరు

# పూజ

చినుకు చినుకూ
దుముకుతుంటే
మెరుపు వెలుగున
మినుకుమంటే

మసక చీకటి
మసలు వాకిట
చిన్ని కాంతులు
చిందుతుంటే

అందమొలికే
ప్రకృతి ఒడిలో
ప్రేమ పూజని
చేసుకుందాం

సంతృప్తిని ప్రసాదంగా
సంతసంతో స్వీకరిద్దాం

# మౌనం

మూగవోయిన గళం వెనుక
మాటలాడే మనసు వుంటే
పెదవి విప్పి పలుకలేక
పదములల్లి పాట కట్టే
మౌనమెంతో అందమైనది
భావుకతతో భవ్యమైనది

సంగీతం — తుంగభద్ర
రాగమనే నావనెక్కి
వీణ చే - చుక్కానిగా
సంగతుల్ని మీటిస్తూ
పులకరించే ప్రవాహంలో
రసరమ్య తీరాన్ని చేర్చే
నీ
మౌనమెంతో మృదువైనది
మాటకన్నా మధురమైనది

# బాధలోంచి....బయటకు....

ఎదురు చూడని బాధలొచ్చి
ఎదను తూట్లుగ పొడిస్తే
రుధిరమంతా ఆవిరైయింది
ఆవిరి తప్ప ఎరుపులేని
కళ్ళని చూసి
పాండురోగమన్నారు డాక్టర్లు
ఆర్ద్రిత కోల్పోయిన హృదయంలో
బాధలు ఇమడలేకపోయాయి
బాధలన్నిటినీ ఉండగాచుట్టి
కన్నతల్లిలా కడుపులో దాచుకుంటే
కరడు కట్టిన గాయాలన్నీ కలిసి
బండరాయిగా మారాయి.
కానీ భూదేవిలా
ఎన్నని
కడుపులో దాచుకోవడం?
భారం పెరిగితే
ఏదైనా బ్రద్దలుకాక మానదు
వ్రణం పరిపక్వమైతే
వ్రయ్యలుకాక మానదు

భారాన్ని మొయ్యలేని భూదేవి
గర్భాన్ని బ్రద్ధలు కొట్టుకుంటే ఎలా?
అందుకే మనసు ఆర్ద్రతని కోల్పోతే
ప్రత్యూషంలో మంచు బిందువుల్ని
అలంకరించుకున్న సుమబాలల్ని
అర్థిస్తాను
శరీరంలో
రక్తం హరించుకుపోతే
సీతాకోక చిలుక నడిగి
నాలో మకరందాన్ని నింపుకుంటాను
బరువు మొయ్యలేని కడుపు
కోతకి గురయితే
హృదయాన్ని మరింత
విశాలం చేసుకుంటాను
అప్పుడు నాకు
అంతటా ఆనందమే
అంతటా విజయమే
అంతటా ఆత్మ విశ్వాసమే

# రాత్రి

అందమైన
కలలాంటి రాత్రి
అంతం ఎందుకవుతుంది?
భయంకర వాస్తవంలా
పగలెందుకు మొదలవుతుంది?
వెచ్చని కౌగిలింతలు
నులివెచ్చని పూరడింపులు
మెల్ల మెల్లగా చీకటిలో
కరగిపోయి
బండెడు చాకిరీకోసం
భళ్ళున తెల్లవారుతుంది
బ్రతుకు పోరాటం
ప్రారంభమవుతుంది
అవసరాలని
అందుకునేటందుకు
వేగమయిన పరుగు—
కాలంతో పరుగుపందెం...
పరుగెత్తి పరుగెత్తి
పరుగెత్తి...పరుగెత్తి...
ప....రు....గె.... త్తి....

అలసి....సొలసి....
రొప్పి....రోసి....
నీ...రసంగా, నిస్త్రాణగా
మంచంమీద
వాలిపోయే క్షణంకోసం
వెన్నుతట్టి
వెచ్చదనాన్నిచ్చే చీకటికోసం
ఆశగా ఎదురు తెన్నులు....
ఆ చీకటి రాత్రంతా
ఏ క్షణంలో తెల్లవారిపోతుందోనని
భయంగా బెదురుచూపులు....

# కలలు

కనులు మూసి నిదురిస్తే
కమ్మని కల కనవచ్చు
కనులు తెరచి చూస్తే
కల చెదరిపోవచ్చు.

కలలు మనకి తగినవైతే
కనులు తెరచి కృషి చేస్తే
కృషి సఫలం కావచ్చు
కనుల వెలుగు నిండవచ్చు

# ఉయ్యాల

వర్తుళాటు కొయ్యపై
తుది మొదళ్ళ సూత్రంతో
మనిషి బ్రతుకు ఉయ్యాల
మనసు ఊగు జంపాల

అటు ఊగితే
ఆనందపు టంచుల కెగబ్రాకుతుంది
ఇటు ఊగితే
బ్రతుకు భయం దిగువకు దిగజార్చుతుంది

ఆనందం - బ్రతుకుభయం
మార్చి మార్చి తరచి చూసి
ఊపులకు, త్రోపులకు
బెదరి చెదరిపోకుండా
ఉయ్యాలను వశపరచుకుని
సమతులనం సాధిస్తే
బ్రతుకంతా లయబద్ధం
మనిషికెంతో మనోబలం

# బంధం - అందం

పవలు రేయికి నడుమ నిలిచే
సంధ్య ఎంతో సుందరం
కనుబొమలకు నడుమ వెలిగే
కుంకుమెంతో పునీతం

ఆకు ఆకుకు మధ్య కదలే
వెన్నెలెంతో సోయగం
పూలరేకుల నడుమ చేరే
భ్రమరమెంతో భ్రాజితం

మనసు మనసును కలిపి పెరిగే
ప్రేమ ఎంతో మధురిమం
మంచి మాటల నడుమ కలిసే
స్నేహమెంతో పవిత్రం

# స్వేచ్ఛా తిరస్కృతి

మంచు తడి ఆరని మల్లెల్ని చూసి
మల్లెలా స్వచ్ఛంగా ఉందామనుకున్నాను
హాయిగా ఎగిరే విహంగాన్ని చూసి
దానిలా స్వేచ్ఛగా ఎగరాలనుకున్నాను

ముద్దుగా నవ్వే ముద్దబంతిని చూసి
ముద్దుగా ముగ్ధలా మెరియాలనుకున్నాను
కమ్మగా పాడే కోయిలని చూసి
గళమెత్తి స్వేచ్ఛాగానంచేయాలనుకున్నాను

అందాల సీతమ్మ చీర చిలుకను చూసి
ఆ రంగులు నాలో దాచుకోవాలనుకున్నాను
చక్కగా ఊగే తరుశాఖల్ని చూసి
పచ్చగా కలకాలం వుండాలనుకున్నాను.

కాని,

బ్రతుక నేర్పు అనే కపటనటన వెనుక
మల్లెల స్వచ్ఛత మరుగుపడిపోయింది
సమాజ నిబంధనల నిశిత బాణాలతో
రెక్కలు విరిగిన స్వేచ్ఛావిహంగం
ఒరిగిపోయింది

లోక మాలిన్యాల గాలి తగిలి
ముద్దబంతి ముఖం ముడుచుకుంది
స్వేచ్ఛకు విధించిన శృంఖలాలను చూసి
కోయిల గొంతు బొంగురుపోయింది

అగ్నిశిఖ చుట్టూ తిరిగే శలభాలలా
అందాలు చిందే యువతుల చుట్టూ
తిరిగి పతనమయే యువకుల్ని చూసి
'ఒద్దు నాకీ స్వేచ్ఛ' అని కసిగా అరిచాను

## హరివిల్లు

వానజల్లు తుంపరలై
మేనిపైన కురుస్తుంటే
మబ్బు చాటు సూరీడు
దొంగ చూపు చూస్తుంటే
మంచితనపు మాటలా
మనసుకెంతో హాయిగా
వలచిన హృదయంలోని
మధురమైన భావంలా
అందమైన సాయంత్రం
ఆనందపు టంబరాన
మదికెంతో సంబరాన
హరివిల్లె విరుస్తుంది

## భగవాన్!

భగవాన్!
నువ్వసలున్నావా?
ఉన్నావని నమ్మమంటున్నావా?
సరే....
ఉన్నావనుకుందాం....
అడ్డులేని అన్యాయాలకు
అంతులేని అక్రమాలకు
ఏదోయీ నీ జవాబుదారీ?

మంచికి మెప్పు
చెడుకి శిక్ష
అని చెప్పుకున్నావుగా
మహా గొప్పగా....
అది అందించేదీ
నువ్వే నన్నావుగా?
మరి చూస్తే
అంతా తారుమారుగా
అగుపిస్తున్నదిగా!

'కలడు కలండనెడువాడు
కలడో లేడో'

మహా మహులకే
వచ్చిందీ సందేహం
మరి-అల్పురాలిని
నాకు మాత్రం రాదటయ్యా?
అందుకు నీ
రుజువేమిటి తండ్రీ?
వుంటే మరి—
నా ముందుకి రావేం?
నా కంటికి కనపడవేం?
హుఁ!
దొంగవు కదా
ఎలా కనపడతావ్?

అగ్ని ప్రజ్వరిల్లే గుండెలతో
నేనడిగే ప్రశ్నలకి
నీ దగ్గర
సమాధానం వుంటేగా?

భగవాన్!
నువ్వున్నా కపటివి
తప్పించుకు తిరుగుతూ
ప్రజలని
మురిపిస్తూ

మరపిస్తూ
'భగవాన్!' అని
పిలిపించుకుంటూ
మా పూజలందుకుంటూ
మమ్మల్నెంతగా
మభ్యపెడుతున్నావు?!
అందువల్ల నీకేం ఒరిగిందోయ్?

ఈ జగన్నిర్మాణంలో
ఎన్నెన్ని తప్పులు చేశావు!
నువ్వు
నా కంటపడే రోజు
నిన్ను
నేను తూర్పారబట్టే రోజు
రాదంటావా?
ఆ రోజే వస్తే
నా ముందు
నువ్వు చేతులు కట్టుకుని
దోషిగా నిలబడ్డం
ఆహా....నాకెంతటి ఆనందం!

# కవితా సందేశం

ఏమివ్వను కవితా సందేశం
భావా నిర్లిప్తం నా హృదయం

ఆశలు అడుగంటినవనా?!
ఆశయాలు అణగారినవనా!
ఉత్సాహం నీరుగారిందనా?!
మెదడు మొద్దుబారిందనా?! ॥ఏమివ్వను॥

మనసులో భావ తరంగాలు
ఆవేశంతో ఎగసి పడుతుంటే
చెప్పాలనిపించే ఉత్సాహానికి
అవరోధాలు ఆనకట్టలౌతుంటే ॥ఏమివ్వను॥

నిత్య జీవితంలో పచ్చి నిజాలను
మనసొాగక వెలువరిస్తుంటే
మనసు ఔనని ఘోషిస్తున్నా
కాదని ప్రజ ఖండిస్తుంటే ॥ఏమివ్వను॥

స్త్రీ స్వాతంత్ర్యం, సమాన హక్కులని
బల్ల గ్రుద్దుతూ ఉద్ఘాటిస్తుంటే,
సభ కలంకారం తెచ్చే మహామహులంతా
పెళ్ళాం పిల్లలకి మడికడుతుంటే ॥ఏమివ్వను॥

# భావి భారత పౌరులం

మేమేనండి నేటి విద్యార్థులం
అంటే భావి భారత పౌరులం
మా నాయకుల ప్రతిబింబాలై
వెలుగొంద శిక్షణం పొందే విద్యార్థులం
విద్యార్జన మా ధ్యేయమా? లేదు, లేదు:
విద్యకోసమా కళాశాలలు? కాదు, కాదు;
సమ్మె మా ధ్యేయం, కాలయాపన మా లక్ష్యం
స్వయంవరానికి మా కళాశాలే ఓ మంటపం
"ఎందుకండీ విద్య? ఏది శాశ్వతం!
బుద్బుదప్రాయమౌ జీవితం కోసమేల ఈ ఆరాటం
కూడా పెట్టుకుపోతామా విద్యా-ధనం?"
అనే వైరాగ్యంలో బ్రతికే యోగి పుంగవులం
అధ్యాపకులంటే పోషకులము, పసివాళ్ళం మాకేంతెలుసు
నిరుద్యోగ సమస్యతో ప్రసక్తంటే
నిరక్షరాస్యులై తిరిగితేనేం??
రాజకీయాలలోనైనా తిరమత లేకుండా
ఇపుడే ఆరితేరుతున్నాం ఎన్నికల రంగంలో
అందుకేనండి నేటి విద్యార్థులం
భావి భారత పౌరులం!

# పాపలు

చిన్ని చిన్ని పాపలు
నడయాడే దివ్వెలు

బ్రతుకు పూల తోటలో
పరిమళించు పూవులు

నిశి నిండిన మనసులలో
ఆశ రేపు తారకలు

వెన్నెల తమ మోముల్లో
విరియించే జాబిలిలు

బ్రతుకుమీద ఆశ నింపు
బంగారు పాశాలు

సంసార సాగరంలో
జిలుగునిచ్చు రత్నాలు

# అక్షరాలు

అక్షరాలు....
నా హృదయ మందిరాన్ని
నా ఊహల దేవతల్ని
తెరచి చూపు గవాక్షాలు
అక్షరాలు....
సాహిత్య సరస్వతికి
అలంకార మొనరించే
మేలు జాతి ముత్యాలు
అక్షరాలు....
మరపురాని అనుభూతిని
మాటల్లో చెప్పలేని
మధురమైన రహస్యాలు
అక్షరాలు....
దూరదూర తీరాలకు
అభిమానం ఆపేక్షలు
మోసుకెళ్ళే విహంగాలు

# ఆకాశం

నిర్మలమీ ఆకాశం
నిబ్బరమౌ నీలిమతో
నిశ్చలమౌ నటరంగం
మనిషికి అది ఆదర్శం

ఒయ్యారపు కులుకులతో
వగలమారి బెళుకులతో
వివిధ నాట్య భంగిమలతో
కదలివచ్చునొక మేఘం

ప్రణయకేళి కోసమై
ప్రియుని చెంత చేరుటకై
త్వరపడుతూ తత్తరపడి
పరుగుదీయు మరో మేఘం

నిండునెలల గర్భిణిలా
నడవలేక నడవలేక
భారంగా పయనిస్తూ
స్రవించే నీలి మేఘం

సింధూరపు సరస్సులో
సరాగాల స్నానమాడి
సిగ్గులతో ఎర్రబడే
చక్కదనం ఒక మేఘం

పసుపునీట జలకమాడి
జరీఅంచు చీరగట్టి
పెళ్ళిపడుచు భంగిమలో
హొయలొలికించొక మేఘం

మేఘ సఖులు ఎందరైన
రంగులెన్ని మార్చినా
మెరుపులెన్ని మెరిసినా
కన్నీళ్ళను కురిసినా
నిర్మలమీ ఆకాశం
నిబ్బరమౌ నీలిమతో
నిశ్చలమౌ నటరంగం
మనిషికి అది ఆదర్శం

## చైతన్యోదయం

విరిసే పువ్వులు
వెన్నెల సోనలు
కురిసే వానలు
కదలే కాలం
నవ్వే పాపలు
పలికే హృదయం
ఆశకు మూలం
చైతన్యోదయానికి
తొలి కిరణం
పలుకుతుంది నాంది

# వెన్నెల

ప్రతి పువ్వును పలుకరించు
ప్రతి కొమ్మను పులకరించు
పచ్చని పూదోటలో
పందిరి సిరివెన్నెల

ఉరకలెత్తు గోదావరిలో
మెరిసే కెరటాలలో
ఒయ్యారపు వంపుల్లో
సయ్యాటల వెన్నెల

నింగినుంచి నేలవరకు
నిగ్గులెన్నో పంచిపెట్టి
నిన్ను నన్ను మురిపించే
నవ చేతన వెన్నెల

మెచ్చిన చెలి కౌగిలిలో
మెరిసే కనుచూపుల్లో
మెత్తనైన మనసులో
మృదుభావన వెన్నెల

# గోదావరి - కావేరి

గోదావరి గట్టుమీద
గలగలమని నవ్వినపుడు
కావేరీ తీరంలో
కబురులెన్నో చెప్పినపుడు
ఏ ఊరిది ఆ అందం
ఆ తీరానికి అది మధురం

నీ ఊరి జ్ఞాపకాలు
అందమైనవా చెలీ?
మా ఊరి మధుర స్మృతులు
మరపురానివా చెలీ?
అని అడిగితే ఎలా?
తికమక పెట్టకు ప్రియా

గోదావరి గట్టుమీద
బాసలలో నిజాయితీ
కావేరీ తీరంలో
కనువూసుల నైర్మల్యం
నా ఊరిని వదలనీవు
నీ ఊరిని మరువనీవు
గోదావరి నా హృదయం
కావేరీ నా ఊపిరి.

# సబ్బు బుడగ

'ఉఫ్' అని వూదితే
'గుప్' అని ఎదిగి
చక చక కదిలీ
'టప్' అని పగితే
సబ్బు బుడగలో
చిందే అందం
అరక్షణమైనా
అది నడిచే నడకలు
పంచే వెలుగులు
చిమ్మే జిలుగులు
విరిసే రంగులు
ఆడుతూ, ఎగురుతూ
చూసే పాపల
కనుపాపల
మెరిసే మెరుపులు
విరిసే పెదవుల
కురిసే నవ్వులు
చూసే మనసుకు
అరక్షణమైనా
అందే ఆనందం
మరువలేనిదా క్షణం

# ఉదయ గీతం

చీకటిలా ముసిరిన
నా కేశరాసిని విడదీసి
మెరిసే

నా పాపట సింధూరాన్ని
ముద్దిడబోయే ప్రియతమా
నిరాశల చీకటిని పారద్రోలే
సింధూర వర్ణపు
సూర్యబింబం
ఉదయించడానికి సిద్ధంగా
నీ బ్రతుకు వాకిట
ప్రతిరోజూ
నీ కోసమే నిలుస్తుందని
ఏనాడూ
మరువకు సుమా!

# గౌరవ ప్రకటన

సందోహం జన సందోహం
ఎందుకోసమనా నీ సందేహం??
ఉత్సవం శుభ జయంత్యుత్సవం
ఎవరిదనా మీ కుతూహలం??
జనంకోసమే తపించిపోయి
స్త్రీ జనం మేలుకై శ్రమించిపోయి
సేవయే తన దినచర్యగా
జీవించిన కందుకూరిది

ఈ జయంత్యుత్సవం
అందుకే ఈ జన సందోహం

సంఘ సంస్కర్తల్లో ఆయనే గొప్ప యీనాటికీ
కాని, సంఘంలో సంస్కారం శూన్యమీనాడు

ఆరవతరగతివాడి కాయన గూర్చి తెలుసు
అరవ వాడికీ తెలుసాయన గూర్చి
తెలియవలసిన మనకు తప్ప
తెలుసునందరికి ఆయన గొప్ప

బాల్యవివాహాలను మనమూ కాదంటున్నాం
వరకట్నాలని మాత్రం వరాలుగా భావిస్తూనే వున్నాం
చెట్టు పేరుచెప్పి కాయలమ్ముకోవడం
ఎవరూ నేర్పకనే అలవర్చుకున్న విద్యాధికులం మనం

బ్రతికినన్నాళ్ళూ శాపనార్థాలు పెట్టినా
చనిపోయాక ఘనంగా ఉత్సవాలు నిర్వహిస్తాం
మా తాతలు నేతులు తాగారన్న పైనం
ఘనతగా చెప్పుకు మీసాలు తిప్పుతున్నాం

సంస్కరణలంటే కొంచెం వెనుదీస్తేనేం
సంస్కర్తలపట్ల మాకూ మా పెద్ద గౌరవం

(తమిళ మహాకవి సుబ్రమణ్యభారతి పీరేశలింగాన్ని
పాత్రగా తీసుకుని చంద్రిక కథ అనే నవల రాశారు)

# క్రౌర్యం

ముద్దులు మూటగట్టే
పదేళ్ళ తెలిసీ తెలియని ప్రాయంలో
నాతో నువ్వాడిన గిల్లికజ్జాల్లో
గుడ్ల నీళ్ళు కుక్కుకుని
కాటుకతో నా చెక్కిళ్ళని తడిపిన బేలమనసు-
ముదిమికి ఇవతల మూడు పదులున్న
ఎదిగీ ఎదగని ఈ ప్రాయంలోనూ
నా చెక్కిళ్ళని తడపగలదని
నిరూపించిన నా నేస్తం
నీ క్రౌర్యానికి శతకోటి వందనాలు.

# ఆర్ద్రత

వినీల గగనంలో
వయ్యారంగా వెలిగే
వెండి మబ్బొకటి
కన్నెపిల్ల హృదయంలా
కలల్ని కాంతుల్ని
నిలువెల్లా నింపుకుని
చిరుగర్వంతో
సిగ్గుపడుతోంది.

ఆర్ద్రత సహజంగా వున్న
అచ్చమైన ఆడపిల్లలా
అందరి బాధల్ని
కన్నీళ్ళనీ పంచుకుని
బరువు, బాధ పెంచుకుని
భరించలేక భళ్ళున పగిలింది
కన్నీరు కాలువలై ప్రవహించింది

# స్నేహ మాల

మల్లె పూలని
మాలగా చేర్చడానికి
ముల్లులా గుచ్చే
సూదిని వాడాలంటే
మధుర భావాలు చిందే
మృదువైన హృదయాన్ని
మాటల శూలాలతో
పొడిచినట్లవుతుంది
మల్లెల్ని ముచ్చటగా కూర్చి
మాలగా కడుతుంటే
మమత అనే దారంతో
మంచి మనసుల్ని,
స్నేహం సౌహార్ద్రత కోరే
సాటి మనుషుల్ని
చెంతకు చేర్చిన
తృప్తి దొరుకుతుంది నాకు

# ఆకారణోత్సవం

భరతమాతకైతే
శృంఖలాలు విడిపడ్డాయి
భారతీయుల బ్రతుకులకి మాత్రం
సంకెళ్ళు పడ్డాయి
బ్రతకాలా? మానాలా? అనే సమస్య
బ్రతుకుల్ని వేధిస్తుంటే
స్వాతంత్ర్యోత్సవం అనే మాట
చస్తూవుంటే సంధిమంత్రం కాదూ?
ఎందుకీ వేడుకలు?
ఎవరిదీ స్వాతంత్ర్యం?
ఏడ్చే పసిపాపలదా?
నింగినంటే ధరలదా?
అక్షయమైన దారిద్ర్యానిదా?
అదరగొట్టే దొరల దౌర్జన్యానిదా?
పెద్దవాళ్ళ పెట్టెల్లోకి
పదిలంగా చేరే నల్లధనానిదా?
మనం కొనిపెట్టిన దండ తగిలించుకుని
పుష్పవాగ్దాన కుసుమాలను వెదజల్లే
మంత్రిగారి మాటల మాయలో పడిపోతే
పెరిగిపోయే నిరుద్యోగ సమస్య తీరుతుందా?

పక్కదారి పట్టించే
బల్లకింద చేతుల్ని తృప్తిపరుస్తుందా?
వేదనలెన్నో
వేధించుకు తింటుంటే
వేడుకనేది మాకు
అర్థం తెలియని మాట
మా బ్రతుకులకింకా—
స్వాతంత్ర్యం లేదు
మాకు స్వాతంత్ర్యోత్సవం చేసుకునే
అర్హతా లేదు
కడుపు నిండిన మారాజులు
కోరికలు తీరిన
మహామాత్యులు
చేసుకునే వేడుకల్ని
చూసి ఆనందించే ఓపికా లేదు

# ప్రతిబింబం

అద్దంలో ప్రతిబింబం
మనసు విప్పి చూపలేదు
స్వచ్ఛమైన ముఖబింబం
మనసు దాచి వుంచలేదు.

# ఎందుకీ స్వాతంత్ర్యం??

స్వార్థం రక్తంతోపాటు దేహంలో ప్రవహిస్తే
దేశం ఏ గంగలో కలిసిపోతేనేం అని భావిస్తే

అప్పుడభివృద్ధి అనేసి అన్నా
అయిపోతుంది గుండ్రని సున్నా

ఎగురవలసిన పతాకం మరీమరీ యెగురుతోంది
ఎందుకంటే మంత్రుల ఉపన్యాసాల ధాటికి ఊగిపోతోం
మంత్రిగా రన్నింటికి ఇస్తారు పర్మిట్
ఎటొచ్చీ తనని విమర్శించడానికే ఇవ్వరా.

అభివృద్ధి జరగడం లేదని బాధపడకు!

అనేక రాష్ట్రాలలో మంత్రివర్గం సంఖ్యని అభివృద్ధి చేశారు
ఉన్న సమస్యలకి అనేకం జోడించి సమస్యలతోరణం చేశారు

తనకు మాలిన ధర్మం తగదని

తమ బంధువుల కుటుంబాలని ఆదుకుంటున్నారు
కావా అవి అభివృద్ధి పథకాలంటున్నారు.

సోషలిజమంటే సమంగా అన్నీ పంచుకోవటమేనని
మంత్రులందరూ వాటాలు వేసుకుంటూనే వున్నారు

ఆశయాలు కాశ్మీరు దగ్గరా
ఆచరణలు కన్యాకుమారి దగ్గరా
పొంతనా? అది మృగ్యం

కష్టపడేవాడు జీవించలేని
ఈ స్వాతంత్ర్యం యెందుకా?
ఆగస్టు పదిహేను ఉత్సవం జరుపుకోడానికి
ఉపయోగరహితమైన ఈ ప్రభుత్వం యెందుకా?
మాకూ ఒక ప్రభుత్వం వుందని ఇతర దేశాలకి
చెప్పుకోడానికి.

## ముడులు

పెళ్ళినాడు నువ్వు వేసిన
ముళ్ళు మూడయితే
అవి అందమయిన అనుభూతిగా
మనిద్దర్నీ బంధిస్తే
ఆ బంధనంలో జీవితం
సజావుగా సాగాలని
ఈ అనుబంధ సూత్రం
తెగకుండా బిగించాలని
నేను వేస్తున్న ముళ్ళు ఎన్నో
ఎన్నెన్నో

(ఇంతకీ భర్త నువ్వా నేనా?)

## తాగాలని వుంది

శాశ్వతమైన ఈ నరకాన్ని వదిలి
తాత్కాలికంగానైనా స్వర్గాన్ని చేరాలనీ
మనసులోని బరువు తగ్గేలా
మైమరచేలా తాగాలని వుంది.

మనసులో గూడుకట్టిన వ్యథకీ
మదిలో ప్రతిధ్వనించే విషాద గీతానికీ
వీడ్కోలు గీతం ఆలపించ గల్గేలా
మత్తుగా చిత్తుగా తాగాలని వుంది

చంద్రుని చేర యత్నించే రాహువునీ
వసంతాన్నధిగమింప చూసే గ్రీష్మాన్ని
చూసి భరించలేని నా పిచ్చి హృదయాన్ని
సేదదీర్చేలా తృప్తిగా తాగాలని వుంది.

మంచికి జరిగే అవమానాన్ని
దానినాపలేని నా అసమర్థతనీ
తలుచుకుని తలుచుకునేడవకుండా
మనసు శిథిలమయ్యేలా తాగాలని వుంది.

మనిషికి మననుండరాదనీ, వున్నా
అది పాషాణమైపోవాలనీ, అది

పీటలు వారినా కరగరాదనీ
మనసుకి పాఠం నేర్పేలా తాగాలని వుంది.

తాగి తాగి మత్తెక్కి, మైమరచి
సోలిపోయి, 'యిహం' వదలి 'పరం' చేరి
మనుషులకు దూరంగా మసల గలిగే
ఆ తృప్తినీ, ఆనందాన్నీ క్షణికంగానైనా
అనుభవించాలనీ ఇంకా తాగాలనీ....

## జోల

అల్లీ బిల్లీ ఆటలు ఆడి
అలసి వచ్చిన చిన్నారీ
మీగడ పెరుగు
కలిపిన అన్నం
గోరు ముద్దలు
తినిపిస్తా!
కమ్మని కథలు నే చెప్తా,
ముద్దు ముద్దుగా జోకొట్టా!

# రా జీ

అనురాగపు శిఖరాగ్రాన్ని
అదిరోహించావు ఆనందంగా
నిలుచున్నావు ఆశగా
రా ప్రియా! అన్నావు తీయగా
సమాజపు కట్టుబాట్ల లోయలలో
పరువు ప్రతిష్ఠల ఫెన్సింగ్ మధ్య
నను వీడలేని భూమాత వడిలో
వున్నాను ప్రియా, నే రాలేను ప్రియా
మనసులో వ్యథ చెప్పడానికి మాటలేరాక
కనులతో చెప్పావు, సైగలే చేశావు
పగిలిన హృదయంతో, చెదిరిన మనశ్శాంతితో
జాలిగా చూశావు, విరక్తిగా నవ్వావు
మన ఆరాధన అపూర్వం, వ్యామోహం క్షణికం
వేచియుందాం ప్రియా!! మరు జన్మకోసం
మదిలోని నా ప్రతిమ నారాధించుకో
కుదుర్చుకో 'రాజీ' జీవితంతో.

## వీణ

అందమైన వీణ
అనురాగ తంత్రుల వీణ
శాస్త్రజ్ఞానం తప్ప
స్పందన ఇసుమంతైనా లేని
వైణికుని చేతచిక్కితే
యాంత్రికంగా
శాస్త్రబద్ధమైన రాగాల్ని
పలికించగలదేగాని
అమృతప్రాయమైన
అనురాగాన్నొలికించలేదు,

మృదుత్వమెరుగని
మూర్ఖుని చేతబడితే
మొరటు శబ్దాలేగాని
మధుర రాగాలని
ఆలపించలేదు.

ఆత్రగాడి చేతిలో
అపశృతులు పలికితే
ఎంత చక్కని రాగమైనా
చేదు చిందకమానదు.

అదేవీణ
అదృష్టం కొద్దీ
రస హృదయుని
ఆత్మీయ హస్తాల నడుమ
అలరారితే
అనురాగ గీతాన్ని
ఆలపిస్తుంది
భావుకుని బాహువుల మధ్య
భావనామయ లోకంలో
స్పందన కొనగోళ్ళ స్పర్శతో
అమృత బిందువుల్ని
చిలికిస్తుంది
సంగీతం
వియద్గంగలా
ప్రవహిస్తుంది.

# కాలం కాని కాలంలో ....

వసంతుడికి స్వాగతం పలకాలని
వనరాణి పచ్చదనపు చీర సింగారించి
జడల్లుకున్న కోర్కెల పాయల్లోకి
వలపు పరిమళాలు చిలికే మల్లెల్ని తురిమి
లేత మామిడి చిగురు వగరూ
ఆ వగరు తిన్న కోయిల కూత పొగరూ
ముచ్చటగా కలబోసుకున్న గొంతులో
బెదురుతున్న గుండె
కొట్టుకులాడుతుంటే
తత్తరపడే హృదయంతో
తడబడే అడుగుల్తో
ముంగిట్లో నుంచుంటే
కాలంకాని కాలంలో
ప్రచండ మారుతం వీచి
పచ్చదనాల చీరని
చీలికలు చేసేసింది.
కోర్కెల్ని,
గుబాళించే మల్లెల్ని
నిర్దాక్షిణ్యంగా చిదిమి
ఛిద్రం చేసేసింది

తేనెలొలికే గొంతు
మూగపోయింది
మమతలొలికే హృదయం
తూట్లుపడింది
ఖిన్నవదనంతో
భగ్న హృదయంతో
వనరాణి వెనుదిరిగి
విషాదంలోకి కరిగిపోయింది.

## అప్పచ్చి

మోపెడు బరువూ
మోసుకు వెళ్ళి
బడిలో చక్కగ
పాఠం చదివీ
అ ఆ ఇ ఈ
అన్నీ రాసి
అంకెలు ఎక్కాల్
లెక్కలు చేసి
అలసి సొలసి వచ్చానమ్మా
నీ కోసం నే నొచ్చానమ్మా.
ఆకలి బాగా వేస్తోంది
అప్పచ్చేదో పెట్టమ్మా

# వెన్నుపోటు

ఆ రోజూ
రోజూలాగే
తెల్లవారింది
ప్రకృతి
ప్రశాంతంగా నిదురలేచి
కళకళ లాడుతూ
కిలకిల నవ్వుతూ
బాల భానుని
లేత కిరణాలని
తాజా నవ్వులతో
పలుకరించింది.
నా కన్నా లేచావా?
నా చిన్నా ఒడిలోకి రారా
అంటూ
తల్లి
బిడ్డల్ని అక్కున చేర్చుకుని
వెన్ను నిమిరింది
కంచే చేనుని మేస్తుందన్న సామెతని
చేను మరచి పోయింది

ఆహ్లాదాన్ని, ఆహారాన్ని
అందించడమే చేనుకి అలవాటు
అమృతమయమైన పాలు తాగిన
ఎదని తన్నగలిగే
బిడ్డలుంటారని
తల్లికీ ఎరుకలేదు
అంతులేని ఆపేక్షని
కురిపించడమే
ఆమెకి అనాదిగా వున్న
సహజ గుణం
నీడనిచ్చే
చెట్లని నరుక్కునే
నిర్భాగ్యులున్న
మన దేశంలో
ఆ దుర్దినాన
దుర్ముహూర్తం—దురాలోచన
రాహుకాలం—యమగండం
అన్ని దుష్ట శక్తులూ
ఒకేసారి ఆసన్నమయ్యాయి
కంచె తిరగబడి
పచ్చటి పైరును
కబళించి వేసింది

తల్లిని రక్షించుకోవలసిన
తనయులు
ఊహించని తీరున
వెన్నుపోటు పొడిచారు
తమ స్వహస్తాలతో
తూటాల వర్షాన్ని కురిపించి
తల్లిని ఆమె రక్త ధారలతోనే
అభిషేకం చేసారు

నీడనిచ్చే చెట్టు
గొడ్డళ్ళకి బలయ్యి
నిలువునా కూలిపోయింది
అహింసకి నిర్వచనం చెప్పిన
ఈ దేశంలో
ప్రకృతి విరుద్ధంగా జరిగిన
విధ్వంస కృత్యాన్ని చూసి
ప్రకృతి స్తంభించిపోయింది.

[శ్రీమతి ఇందిరాగాంధీ స్మృతికి]

# సమరం - శాంతి

నాదికాని రక్తం...
ఎక్కడో పుట్టి
ఎక్కడో పెరిగిన
ఏ పుణ్యాత్ములో
దానం చేసిన రక్తం
ఏ తల్లి బిడ్డలో
ఏ గుండె వారసులో
ఏ సుగుణాల ఖనులో
ఏ దుర్గుణాల పుట్టలో
ఎవరయితేనేం
అందరిది ఒకటే ధ్యేయం
మరో ప్రాణాన్ని నిలబట్టడం
దానంగా దొరికిన రక్తం
బొట్లుబొట్లుగా
నా శరీరంలోకి
ఇమిడి పోతుంటే
నదులన్నిటినీ
తనలో కలుపుకునే
మహా సాగరంలా

నిశ్చలంగా స్వీకరించాను
అంతలోపలే
అల్లకల్లోలమైంది సాగర గర్భం
నదులన్నీ సంగమిస్తే
ఉద్భవించింది మహా విప్లవం
అదుపు తప్పిన సాగరాన్ని
అతి తీవ్రంగా మందలిస్తే
మెల్లమెల్లగా వెనక్కి తగ్గింది
అసలేమి జరగనట్లు సద్దుమణిగింది
నిశ్శబ్దాన్ని సంతరించుకుని
కడలి గర్భం చల్లబడింది.
విచక్షణ ఎరిగిన గుండె
వెచ్చదనాన్నందించింది మెల్లగా
సమశీతోష్ణమయింది రుధిరం
క్రమశిక్షణ కూర్చుకుంది
కడలి గర్భం
మెత్తగా మత్తుగా
నిశ్చింతగా నిదురలోకి
ఒరిగాయి మనశ్శరీరాలు.

# మ న సం

స్వచ్ఛమైన మనసు—
చుట్టూ బంధాలు
మరెన్నో అనుబంధాలు
ఇంకొన్ని బలహీనతలు...
హృదయపు మూలల్లో
పదిలంగా దాగున్న
ఆత్మీయతని, అభిమానాన్ని
వ్యక్తం చేయడం ఎలా?
అందరూ కావాలంటుంది
అందరూ నీవారేఅంటుంది
వారినెలా తృప్తి పరచాలో తెలీని
గజిబిజిమైన నా పిచ్చి హృదయం!
ఇచ్చానందరికీ స్థానం
విశాలమైన హృదయంలో
పంచానొక్కొక్క హృదయ శకలాన్ని
నువ్వు కావాలన్న వారి కల్లా
(చివరికి మిగల్లేదు నాకేమి)
అవ్యక్తమైన నా ప్రేమను
ప్రయత్నించి గ్రహించుకో
చేతనైతే వెతుక్కో
ఆత్మీయత నిండిన కన్నుల్లో.

# కార్తీక దీపాలు

తొలి సంధ్య ఝాముల్లో
చలి నిండిన చీకటిలో
గల గల పారే
గోదావరి కెరటాలపై
హారతిపట్టిన దీపాలు
అందంగా అలరారుతాయి
తెల్లని మల్లెల కూర్పుల్లా
తేలియాడుతూ అగుపిస్తాయి
పండంటి పసిపాపల
పాలుగారే బుగ్గల్లా
కన్నెపిల్లల కన్నుల్లో
కాంతులు జిమ్మే మెరుపుల్లా
కన్నతల్లుల గుండెల్లో
కరగిపోని మమతల్లా
ముచ్చటగా వెలుగుతాయి
మనసులో మధురమైన
ఆశలెన్నో నింపుతాయి

# నిరీక్షణ

నీకన్న ముందుగా
నీ తలంపు వచ్చింది
నిదురలేని నా హృదయపు
తలుపు తట్టబోయింది
తెరచివున్న వాకిలిలో
క్షణమైన నిలువలేక
మురిపంగా కదలివచ్చి
నా ఒడిలో వాలింది
ఊహాలలో ఊసులెన్నో
గుసగుసగా చెబుతుంటే
కనులు మూసి కమ్మగ నీ
కబురులేవో వింటుంటే
నిమురుతున్న చేతులలో
మైమరపుతో వున్నవేళ
నీవే నా ఎదుటకొచ్చి
చిరునవ్వుతో నిలుచున్నా
అయోమయపు అంతరంగం
ఆహ్వానం పలుకలేదు

# జాతర

ప్రళయాన్ని సూచించే
పిడుగుల వర్షంలా
భయంకరమైన చప్పుళ్ళతో
బ్రద్దలవుతున్న టపాకాయలు, బొట్లు
పీడకలలా
అర్ధరాత్రి నిద్రలోంచి
హఠాత్తుగా
నన్ను మేల్కొలిపాయి.
నరకానికి ఎవరినో మోసుకుపోతూ
నేటికి
నరమాంసం దొరికిందని
సంబరం చేసుకుంటున్న
కిరాతకులు
చావు బాజా వాయిస్తున్నట్టుగా
డప్పుల మోత !
గుండెలు బ్రద్దలుచేస్తూ
గర్జనలు, గడబిడలు
మండుతున్న మనసుతో
అశాంతిగా
అటు-ఇటు దొర్లాను.

అబ్బా...!
ఏమిటిది ?
ధనానికి, దాహానికి
కళ్యాణమా ?
లేక
వీరభద్రుని
విలయ తాండవమా?
ఎవరి కొంపలు ముంచడానికి?
భయంకరమైన
డప్పుల మ్రోతను
భరించలేక
నన్ను నేనే
సమాధి చేసుకున్నా—
అయినా—
సమాధిలో కంటా చొచ్చుకుని
వస్తోందే ఈ ప్రళయ ఘోష
తలుపులన్నీ బిగించుకున్నా
గుండెల్ని దొలిచేస్తూ
గందరగోళం !
... ... ...
.... .... ....
తెల్లవారిందెలాగో ...,

నిద్రలేక ఎర్రబారిన కళ్ళలో
భగ భగ మంటలతో
పోలేరమ్మ ప్రతినిధిలా
లేచి బయటకి వచ్చాను.
ఒక ప్రక్క
నాయుళ్ళింట్లో
మేక పలావ్ ఘుమ ఘుమలు
మరొక పక్క
బ్రాహ్మణులింట్లో
తీపి బూరెల సువాసనలు
రెండూ కలిసి
మత్తైన గమ్మత్తైన
అదోరకం వాసన
భోజనం వేళకు
రెండిళ్ళనుంచి
పళ్ళాలతో ఫలహారాలు
తరలి వచ్చాయి.

..... .....

సంగతేమిటి ?
రాత్రి పోలేరమ్మ జాతర
ఎంత గొప్పగా జరిగిందో !
మేమంతా అక్కడే వున్నాం
మేకని కూడా కోశాం

అన్నారు వాళ్ళంతా.
తెల్లవారినా
పిడుగుల గర్జన
డప్పుల మ్రోత !
తలపై సమ్మెట పోట్లు
భగభగ మండే నా కళ్ళ ఎదుట
నరమాంసం చేతబట్టుకున్న
రాక్షసులలా
నిద్రలేక ఎర్రబారిన కళ్ళతో
జాతర జరిపిన వీరులు
కళ్ళల్లో ఎరుపు
ఆగకుండా
కళ్ళ ఎదుట ఎరుపు
మ్రోగుతున్న డప్పుల శబ్దం
చిందులు వేస్తున్న
వీరభద్రుని భయంకర రూపం
రక్తంకోసం నాలుక జాపిన
పోలేరమ్మ భీకర వదనం
ఒళ్ళు జలదరించింది
కాళ్ళక్రింద భూమి కదలింది
మూఢ నమ్మకాల
అగాధంలోకి
జారుతూ నేను
నిస్సహాయంగా పడిపోయాను

# ఎందుకమ్మా

అమ్మా అమ్మా చెప్పమ్మా
ఎందుకిలా చేస్తారమ్మా?

గాలి గోల చేస్తుంటే
హాయిగా వుందంటావ్

నా అల్లరి ఆటలంటే
గోల చేయకంటావు॥

ఆకాశం ఏడిస్తే
చల్లని జల్లంటావు

అక్క కంట నీరు పెడితే
ఏడవ రాదంటావు॥

ఆకలిగా లేదంటే
వెంట తిరిగి తినిపిస్తావ్

కాకి వచ్చి ఆకలంటే
హష్ హష్ అని తరిమేస్తావ్॥

చందమామ మేలుకుంటే
చక్కని వాడంటావు

నే నిదురపోక కూర్చుంటే
మందలించి జోకొడతావ్॥

# సితార

మనసు మెచ్చిన నెచ్చెలిని
అనురాగంతో చేతుల్లోకి తీసుకుని
సుతారంగా చెక్కిలి మీటి
సరాగంగా పలుకరించి
ముద్దు ముద్దుగా ఊసులాడి
గిలిగింతల ముంచితేల్చి
అలిగినప్పుడు బుజ్జగించి
వలపు ఒడిలో కవ్వించి నీ
ఒడిని వాలితే పరవశించి
భక్తి భావం తన్మయత్వం
నీ మనసు నిండితే మోకరించే
సితార నే నవ్వాలని
కలలు కంటే నేరమేమిటి ?

నీ చేయి తగిలితే చైతన్యంతో
నువ్వు మనసుపడితే మాధుర్యంతో
స్పర్శతోనే జీవమిచ్చే
శ్రోత బ్రతుకున స్పందనయ్యే నీ
సితారగా పుట్టాలని
బ్రతుకు ధన్యమవ్వాలని నే
మనసు పడితే తప్పేమిటి ?

( రవిశంకర్‌కి )

# పారం

నాన్న రెచ్చిపోయి
నీ ఒంటిమీద వాతలు
పెట్టడం కోసం
నన్ను కుంపటి రాజెయ్యమని
ఆజ్ఞాపించినప్పుడు
నేనెందుకు అంత వినయంగా
ఆ తడి బొగ్గులతో
కుంపటి రాజేసానో
నీకేం తెలుసురా
నా కన్నతండ్రీ
అమ్మ ఎంత క్రూరురాలని
నువ్వు నన్ను తిట్టుకున్నావో !
అసలు నా కన్న తల్లేనా అని
నన్నెంతగా శపించుకున్నావో !
ఆ కుంపటి రాజేసే నాటకం
ఆ రోజు నేనాడకపోతే
నీ ఒంటిమీద
ఎన్ని వాతలు తేలేవో
నువ్వసలు ఊహించగలవా ?
ఆ కగిలే నిప్పులు
ఎగిరే రవ్వలు

# మోడు

కళకళలాడే ఆ వనం చూడు
వెల వెలబోతూ వుందో మోడు
నింగిని అంటే వృక్షాల నడుమ
బలహీనంగా బ్రతుకోంది చావలేక
ఫలభారంతో వూగే వృక్షాల మధ్య
బ్రతుకే భారంగా వూగుతోంది
—ఆధారం లేక

నీరులేని కన్నులున్న నిరుపేదలా
రాల్చడానికొక్క ఆకైనా లేక
—చూస్తోంది నిర్జీవంగా

చూస్తూ చూస్తూ
—జారింది గత స్మృతులలోకి
వాస్తవంలో కానరాని ఆ లోకంలోకి

..... ..... ..... .....

తనలో నాడు నింపుకున్న అందాలు
తానందించిన పుష్ప సుగంధాలు
తన చుట్టూ తిరిగిన భ్రమర రాజాలు
తానందించిన జుంటి తేనియలు
తను ప్రసాదించిన మధుర ఫలాలు
తన నీడలో బ్రతికిన వన్య మృగాలూ

తన కొమ్మలపై మలచిన పక్షి గూళ్ళూ
తానెంతో తృప్తిగా బ్రతికిన బ్రతుకూ
అన్నింటినీ
తనలో తానే
తలపోస్తోందా మోడు
అదే .....
ఒకనాటి 'మహావృక్షం !'
మరి—
ఈనాడో ?
అవయవ హీనంగా మిగిలిన కాండం
పక్షుల తాకిడికే విరిగిన కొమ్మల అవకరం
పుష్ప సౌరభాలూ లేవు
భ్రమరాల సందడీలేదు
తీయందనాలు నిండిన
జుంటి తేనియలూ లేవు
చిరుజల్లుకి చిగురించే
శక్తిలేదు
వెన్నెలనానందించే
రక్తీలేదు
ఎందరికో
ఆధారంగా బ్రతికిన
ఆ వృక్షరాజం .....

అనిపిస్తోంది నేడు
భూమికి భారం !
తన నీడలో బ్రతికిన ప్రాణులు
తననే నిర్లక్ష్యం చేస్తుంటే
చస్తోంది బ్రతకలేక
బ్రతుకుతోంది చావలేక

## పా పా !

చకచక గంతే ఉడతను చూడు
చురుకు చురుకుగా ఆటలు ఆడు.
తియ్యని పలుకుల చిలుకను చూడు
ముద్దుల మూటల మాటలు ఆడు.
మామిడి కొమ్మన కోయిల చూడు
మనసుకు నచ్చిన పాటలు పాడు.
విరామ మెరుగని చేపను చూడు
చదువు సముద్రం తెలివిగ ఈదు.
చిన్నా చితుక పుల్లలు ఏరి
గూడును కట్టే పిచుకను చూడు
మంచి మాటలతో గుండె బలంతో
ముందు రోజులకు దారిని కూడు.

# స్మశాన వైరాగ్యం

మృత్యువు చేసిన విశృంఖల నృత్యం చూసి
మూగగా మిగిలిన శిధిలాల నడుమ నడుస్తూ
అడుగు పెట్టాను విహ్వాల హృదయంతో
ఆనవాళ్ళు కూడా మిగలని దివిసీమలోకి.
శవాలమీదుగా నడుచుకుని వెళ్తూ,
సమాధికి ఆయత్తం అయిన తమ ఆప్తులంతా
ఎక్కడున్నారా అని వెతుక్కుంటూ
ఆరాటపడే జీవచ్ఛవాల కంటే
కొంచెం ఘనస్థానంలో నిలబడ్డాను.
మృత్యు రూపం చూసి గగుర్పొడిచిన గుండెలకి
కొంచెం ధైర్యం చెప్పుకున్నా.
దారుణ మారణహోమం జరిగిన
దివిసీమ బళ్ళకొద్దీ బూడిదగా మిగిలాక
ఆ ధూళి ఎగిరి మేనిపై
చోటు చేసుకుంటుంటే
అదురుతున్న హృదయానికి
ఆ బూడిదలో ఏకమైపోతున్న భావన!
కళ్ళ ఎదుట కంకాళాల నడుమ
కాలుని కదనం చూసి
మోడువారిన హృదయం

కన్నీరంటే ఏమిటో మరచిపోయింది.
చచ్చి బ్రతికిన మందభాగ్యుల కళ్ళల్లో,
చూడవచ్చిన వారి ఓదార్పులతో
ఊటలూరిన కన్నీటి ధారల
తడిసిన ఆ రుద్రభూమిపై
నా కన్నుల వెంట కారాయి రుధిర ధారలు
కరడుగట్టిన గుండెలో ఆర్ద్రత
ఇంకా యెక్కడిదో అర్థం కాలేదు
అల్లకల్లోలమైన నా అంతరంగానికి.
ఉప్పెన వదిలి వెళ్ళిన అవశేషాలమీంచి
వీస్తున్నగాలి నా వంటిని తాకిన క్షణంలో
మరణ సమయంలో ఆత్మపొందే ఘర్షణ
మరుక్షణంలో—
మృత్యువు కావల ఏముందో తెలుసుకున్న భావన!
చివరికి—
అంతా శూన్యమేగా ..... అని
కర్మ సిద్ధాంతంతో రాజీపడుతూ
మరలాను వెనకకి....
నేను నిత్యమూ బ్రతకాలని
పెనుగులాడే
నా ప్రపంచంలోనికి—

# నవ్వాలని....

గట్టిగా నవ్వాలని వుంది,
పగలబడి నవ్వాలని వుంది

మనుషుల్లోని మంచితనాన్ని
వారి మనసుల్లోని త్యాగ గుణాన్ని
అసమర్థతగా. అమాయికత్వంగా
అంచనా వేసే ఈ లోకాన్ని చూసి

॥నవ్వాలని॥

మెరుస్తున్న 'మంచి' అనే బురఖాలో
పెద్ద మనుషులుగా చెలామణిలో
వున్న వారికి బ్రహ్మరథం పట్టే
ఈ లోకాన్ని చూసి జాలిగా ॥నవ్వాలని॥

మంచివాడు విధిలేక చేసిన
ఒకే పొరపాటు నెత్తి పదిసార్లు చూపి
పెద్దమనుషులు ముసుగులో జరిగే పదితప్పుల్ని
పొరపాట్లుగా ఎంచే లోకాన్ని చూసి కసిగా

॥నవ్వాలని॥

'మంచి' తెరలో దాగిన చెడుని,
ఎట్టు ఎదుట నిలిచినా మంచిని,
గుర్తించలేని, తగిన ప్రతిఫలమివ్వలేని
ఈ గుడ్డి లోకాన్ని చూసి హేళనగా ॥నవ్వాలని॥

# మూగపోయిన కోయిల

నా తోటలో స్వేచ్ఛగా గానం చేస్తూ
నా పాటతో నేనే మురిసిపోతూ
లేత మామిడి చిగుళ్ళ మత్తులో లోకాన్ని మరచి
పరవశించి సుఖించే నేను—
మార్పు కావాలనీ కొత్త నేస్తాలతో చేర్పు కావాలనీ
నా తోటని విడిచి నాది కాని తోటని మెట్టాను
ఆ తోట నన్ను ఆదరంగా
ఆహ్వానించిందని ఆనందించాను.
కొత్త కోయిలతో నేస్తం కట్టాను
మార్పు చూసి మైమరచినా
నా పాత తోట పాత పాట
స్మృతిపథాన మెదుల్తూంటే
ఏదో తీరని వెలితి
నా మనసును దొలుస్తూనే వుంది
ఇంతలో
వసంతం రానే వచ్చింది
వనమంతా మెరిసిపోతోంది
వనలక్ష్మి మురిసిపోతోంది
మత్తెక్కించే మల్లెలూ మామిడి చిగుళ్ళూ
మధుపానం చేసే తుమ్మెదలూ

వింత వింత అందాలూ.... కొత్త కొత్త బంధాలూ....
అంతా సంతసమే, అంతా సంభ్రమమే!!
వసంతం చేసే ఈ సందడిని
నా గుండె భరించలేకపోతోంది
ఆనందమో.... ఆవేదనో....
మనసు కదలిపోతోంది.
తోటి కోయిలలు వచ్చాయి
ఉగాది వచ్చిందన్నాయి
ఆనందంగా వసంతగానం చేద్దామన్నాయి
తమతో గొంతు కలపమన్నాయి
నేస్తాలతో గొంతు కలిపి పాడాలనే వుంది
వాళ్ళతో ఆనందాన్ని పంచుకోవాలనీ వుంది—
కాని....
గొంతు విప్పబోతే
ఆవేదనంతా ఘనీభవించి
నా గొంతులో అడ్డు నిలిచింది
మూగగా.... బాధగా....
చూస్తూ ఉండిపోయాను
మళ్లె....మావి పిలిచాయి
పాడవే కోయిలా అన్నాయి
నా నేస్తాలూ నా గానాన్ని
కనులతోనే కోరాయి

కాని..
ఈ కొత్త తోటలో
యీ సరికొత్త వాతావరణంలో
యిమడలేకపోయాను
అందుకే పాడలేకపోయాను
చిన్ననాటి నా వనం నాకు కావాలి
నా పాత గూటికి మళ్ళీ నేను చేరాలి
నా గొంతు ముడివిడాలి
నా స్వేచ్ఛాగానంతో
నా తోటంతా నిండిపోవాలి
ఆ ఆనందాన్ని
ప్రకృతిలోని అణువణువూ పంచుకోవాలి
అప్పుడే నాకు వసంతం
నవయుగాదికి శుభారంభం!

## చినుకులు

చిటపట చినుకులు పడుతూవుంటే
తప తప మంటూ చిందులు వేస్తూ
హాయిహాయిగా ఆటలు ఆడే
పాపలు కిలకిల నవ్వాలి
మెరుపులు మిలమిల మెరవాలి.

